# పాలబుగ్గలూ-పసిడిమొగ్గలూ

## (పిల్లల పాటలు)

పులిపాటి యాదగిరి



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

PAALABUGGALOO-PASIDIMOGGALOO (Children's Songs)
By Pulipati Yadagiri

ప్రచురణ నెం. : 2240

కాపీలు : 1000

ప్రథమ ముద్రణ : జనవరి, 2001



వెల: రూ.20-00

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్, సుల్తాన్‌బజార్ - హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

ముద్రణ: శ్రీ కళాంజలి గ్రాఫిక్స్ హైదరాబాద్ - 29. ఫోన్: 3229831

# కృతజ్ఞతలు

ఈ సంపుటిలోని గేయాలను తమ పత్రికలలో ప్రచురించిన బాలచంద్రిక, ఆంధ్రజ్యోతి వారపత్రిక సంపాదకులకు –

కొన్ని గేయాలను ఆకాశవాణి విజయవాడ కేంద్రం నుండి ప్రసారం చేసిన డైరెక్టర్, ఆలిండియా రేడియో విజయవాడ వారికి నా హార్దికాభివందనాలు. అలాగే ఈ చిన్నారి పాటలను పుస్తకరూపంలో తెస్తున్న విశాలాంధ్ర ప్రచురణాలయానికి నా కృతజ్ఞతలు.

# పాటల బాట



★ ★ ★

# అమ్మ

నింగిన ఉండే జాబిల్లి
ఇచ్చును చల్లని వెన్నెల
ప్రేమయనే తెలి వెన్నెల
ఉంది మా అమ్మ కన్నుల.

వెన్నెలనిచ్చే జాబిల్లి
ఉండదు ఎప్పుడు మింట
వెన్నను పెట్టే మా తల్లి
ఉండును ఎప్పుడు ఇంట.

అమ్మలాగ ఓ కమ్మని పాట
పాడలేదు కద జాబిల్లి
అమ్మలాగ ఓ కమ్మని మాట
చెప్పలేదు కద తన నోట.

అమ్మ మనకు అనవరతమూ
ఇచ్చును ప్రేమామృతమూ
అమ్మయే మన మొదటిగురువు
నిజముగా కల్పతరువు.

*  *  *  *  *

# ఏమి కావాలి?

పాలబుగ్గలా పాపాయికి
ఏమి కావాలి;
ఏమేమి కావాలి?

పాలబుగ్గలా పాపాయికి
పాలు కావాలి
ఓ లాలి కావాలి.

బోసినవ్వులా పాపాయికి
ఏమి కావాలి;
ఏమేమి కావాలి?

బోసినవ్వులా పాపాయికి
అమ్మ కావాలి
ఓ బొమ్మ కావాలి.

జిలిబిలి పలుకుల పాపాయికి
ఏమి కావాలి;
ఏమేమి కావాలి?

జిలిబిలి పలుకుల పాపాయికి
జిలేబి కావాలి
ఓ గులాబి కావాలి.

బుడిబుడి నడకల పాపాయికి
ఏమి కావాలి;
ఏమేమి కావాలి?

బుడిబుడి నడకల పాపాయికి
బువ్వ కావాలి
ఓ అవ్వ కావాలి.

పరుగులు తీసే పాపాయికి
ఏమి కావాలి;
ఏమేమి కావాలి?

పరుగులు తీసే పాపాయికి
పండ్లు కావాలి
బొమ్మరిండ్లు కావాలి.

* * * * *

# నోటి దురద

చాకలి యొక్కడు
పెంచెను ఖరమును
బలిసే రీతిగ
మేప దలంచెను.

పరుల చేలపై
పడి మేయుటకై
కప్పెను దానికి
పులి తోలొక్కటి.

రోజా గాడిద
చేలపైన బడి
మేయుచు పంటను
ధ్వంసమొనర్చెను.

ఇట్టులుండగా
ఒకనాడొక్కడు
పొలము కాపరి
తెగువ బూనెను.

గొంగడి నిండుగ
కప్పుకొని వాడు
పొదల చాటున
పొంచియుండెను.

ఒక్క వ్రేటుతో
తెగటార్చుటకై
బల్లెమునొక్కటి
చేత బూనెను.

పొదల చెంతకు
చేరిన ఖరము
కంబళమును గని
ఇటు తలపోసెను:

" పంటి గాడిద
ఒంటరిగా నిట
నిరీక్షించుచూ
నిలబడి యున్నది."

వ్యాఘ్రరూపమున
నున్న గార్దభము
అతి బిగ్గరగా
ఓండ్ర పెట్టినది.

అరపు విన్న ఆ
పొలము కాపరికి
పులికాదిది గా
డిద యని తెలిసెను.

బలిసియున్న ఆ
ఖరమును కాపరి
యమపురి కంపెను
సంతసమొందెను.

చాపల్యమెంత
ప్రమాదకరమో
తెలిసికొని మనము
నడచుకొనవలెను.

('పంచతంత్రం'లోని కథ ఆధారంగా...)

*　　*　　*　　*

# ఉడతా!

ఉడతా ఉడతా ఓ ఉడతా!
దిగివస్తావా మిఠాయి పెడతా.

చెట్టు ఎక్కడం ఎట్లాగో
గుట్టు విడిచి మరిచెబుతావా?
కొమ్మలు తిరగడమెట్లాగో
నెమ్మదిగా వివరిస్తావా?

చిటారు కొమ్మన ఉంటావు
హటాత్తుగా దిగి వస్తావు
చప్పుడు కొంచెం వినబడినా
చప్పున తప్పుకుంటావు.

చిట్కాలేవో చెబుతావా
చిటారు కొమ్మకు చేరెదను
మెళకువలన్నీ చెబుతావా
హుటాహుటిని దిగివచ్చెదను.

వారధి కట్టే సమయాన
సాయపడితివట రామునికి
'ఉడతాభక్తి'ని నీపేరే
తలచుకొందురు ఎప్పటికీ.

*   *   *   *   *

# నేతలం!

నేతలం మేమూ
విజేతలం మేమూ
భువిలో నవజీవన
ప్రదాతలం మేమూ.

బడుగు జీవులను బ్రోచే
భ్రాతలం మేమూ
భావిభారత భాగ్య
విధాతలం మేమూ.

జనయిత్రిని మన ధాత్రిని
ఘనముగా నర్చించెదం
వినయముగా పనులన్నీ
అనయము సాధించెదం.

ఈసులేని మేమంతా
బోసుబాబు శిష్యులం
కాసుకు ఇసుమంతయును
కాము మేము దాసులం.

బండలనే పిండిచేసి
కండబలము చూపెదం
దండిగ పండించి పంట
తిండి కొరత తీర్చెదం.

*　*　*　*　*

# కోయిలా!

నాలాగా కిలకిలా
నవ్వేదవా కోయిలా?
'హలోహలో' కోయిలా!
పలికెదవా ఇలాఇలా.

కుహూఁ కుహూఁ అంటేనే
గొప్ప కాదు సుమా!
ఉహూఁ ఉహూఁ అంటావా
ధీమాగా చెపుమా?

చిగురులు బాగామెక్కి
ఎగురుతావు నువ్వు
ఏదీ చూస్తా ఒకపరి
నాలాగా నవ్వా?

ముద్దులొలుకు చిలకమ్మ
ఉన్నది మా ఇంట
ముద్దుగ పలుకుచు ఎప్పుడు
ఉండును మా వెంట.

చిలకమ్మకు, నీకూ మరి
పెట్టేస్తాం పోటీ
పోటీలో నెగ్గావా
నువ్వే కదు మేటి.

* * * * *

# ఏడువకు పాపాయి!

ఏడువకు పాపాయి
ఏడువకుమోయి!
ఏడిస్తె ఎరుపెక్కు
నీ కన్నుదోయి.

ఎఱ్ఱబారిన నీదు
కన్నులను గాంచీ
కన్నతల్లీ మనసు
కలత చెందునురా!

ఏడ్పు మానేసి నువు
పాలు తాగుమురా
నిను గాంచి మీయమ్మ
పరవశించునురా!

ఉంగరాలా నీదు
ముంగురులు జూచీ
కొంగు బంగారమని
పొంగి పోవునురా!

ఏడువకు పాపాయి
ఏడువకు మోయి
ఏడిస్తె ఎరుపెక్కు
నీ కన్నుదోయి.

* * * * *

# ప్రేమమందిరం

పాపలందరం ఉండేచోటే ప్రేమమందిరం
నిర్మలమైనది మా మందిరం మహాసుందరం.

తల్లితండ్రులను పూజిస్తాము
గురువుల నెప్పుడు సేవిస్తాము
సుద్దులు చెప్పే పెద్దల మాటలు
ఆమోదిస్తాము; వారిని ఆరాధిస్తాము.

క్రమముగా బడికి వెళతాము
క్రమశిక్షణ పాటిస్తాము
పంతులు చెప్పే పాఠాలన్నీ
శ్రద్ధగ వింటాము; ఎంతో బుద్ధిగ ఉంటాము.

అల్లరి చిల్లరి పనులు చేయము
ఎల్లరినీ ప్రేమిస్తాము
కల్లోలం సృష్టించేవారిని
విల్లమ్ములతో ఎదిరిస్తాము.

నీతిలేని రాకాసిమూకలను
గోతిలోన పూడ్చేస్తాము
ఖ్యాతిని పెంచీ, జగతిలోన మన
జాతిగౌరవం నిలబెడతాము.

*     *     *     *     *

# రావోయీ!

హోయి హోయి ఓ పాపాయీ!
తాయిలమిస్తా రావోయీ!

> తకధిమి తకధిమి పాపాయీ!
> చకచక నడువుము పాపాయీ!

గట్టు ఎక్కుదాం పాపాయీ!
పట్టుకోవోయి నా చేయి.

> గట్టు మీద ఓ చెట్టుంది
> చెట్టుకు బోలెడు పండ్లున్నాయ్.

పండ్లు కోసుకొని వద్దాము
అందరం ఆరగిద్దాము.

> తకధిమి తకధిమి పాపాయీ!
> చకచక నడువుము పాపాయీ!

*    *    *    *    *

# పాపలు

కిలకిల నవ్వే పాపలు
మిలమిల మెరిసే చేపలు

కల్ల తెరుగనీ బాలలు
తెల్లని మల్లెల మాలలు

బుడిబుడి నడకల బుడుతలు
ఆడుచు తిరిగే ఉడుతలు

చిరు చిరునవ్వుల కూనలు
కురిసే తేనెల సోనలు

సిరులొలికే చిన్నారులు
ఎన్నదగిన మిన్నేరులు.

*  *  *  *  *

# ఓ మేకా!

మేకా మేకా ఓ మేకా!
పొట్టిది కదమ్మ నీ తోక?

ఆకులు అలములు తింటావు
ఆనందంగా ఉంటావు
చక్కగ నిన్నూ చూస్తాము
చిక్కని పాలను ఇస్తావా?

కొండల కోనల కెళతావు
వాగులు వంకలు చూస్తావు
మచ్చికతో నువ్ పచ్చిక మేస్తూ
ప్రకృతి ఒడిలో ఉంటావు.

ముద్దు ముద్దుగా ఒడిని జేర్చుకొని
బుజ్జి మేకనూ లాలిస్తావు
మక్కువ చూపే మా అందరికీ
తియ్య తియ్యనీ పాలిస్తావు.

* * * * *

# పాలబుగ్గలు

పాపలూ మీకున్నవి పాలబుగ్గలూ
మీరంతా మా పాలిటి పసిడి మొగ్గలూ.

మొగ్గలన్ని విప్పారిన పువ్వులగునులే
పువ్వులన్ని నవ్వులనూ వెదజల్లునులే

ఆ పువ్వుల పరిమళమే మాకు ఇష్టము
ఆ నవ్వుల వెన్నెలలే మాకతిప్రియము.

కనిపెంచే ప్రతి తల్లీ కల్పవల్లియే
పాపలున్న ప్రతి ఇల్లూ పాలసంద్రమే.

*      *      *      *      *

# ఆనందం ఆనందం

ఆనందం ఆనందం
పాపలు ఉండే
ప్రతి సదనంలో
పరమానందం.

ఆనందం ఆనందం
పాపల జూచిన
ప్రతి వదనంలో
పరమానందం.

అందం చిందే
పాపల బృందం
అగుపిస్తేనే
మహదానందం.

*　　*　　*　　*　　*

# తాతయ్యా!

పిల్లలు:

బుర్ర మీసాల తాతయ్యా!
కిర్రుచెప్పులూ ఎందుకు నీకు?

తాత:

కిర్రుచెప్పులూ ఉంటేను
తుర్రుమంటాయి పాములు, క్రిములూ.

పిల్లలు:

కర్ర ఎందుకూ తాతయ్యా!
బర్రె దూడలను కొడతావా?

తాత:

వెర్రిగ అడిగే కుర్రాళ్ళూ!
కర్ర ఆసరా వృద్ధులకూ.

పిల్లలు:

తిట్టకు మరి నువ్ తాతయ్యా!
చుట్ట కాల్చడం తప్పు కదూ?

తాత:

పట్టిన జబ్బూ వదలదురా!
చుట్ట కాల్చడం తప్పేను.

పిల్లలు:

పళ్ళులేని ఓ తాతయ్యా!
కల్లుతాగుతావెందుకని?

తాత:

కల్లుతాగడం తప్పేకాని
అల్లరి చేయుట మంచిపనా?

పిల్లలు:

ఓడించాం కద తాతయ్యా!
వేధించముతే నిన్నింకా.

*         *         *         *         *

# మా మేస్టారు

బలేవారు మా మేస్టారు
బహుమతులెన్నో ఇస్తారు
తిట్టరు కొట్టరు మేస్టారు
కరుణతోడ మము చూసారు.

తరగతిలోనికి మేస్టారు
అడుగిడగానే అందరును
బుద్ధిమంతులై పోతారు
గప్‌చిప్‌గా కూచుంటారు.

తెల్లని దుస్తుల మేస్టారు
మెల్లమెల్లగా వస్తారు
కళ్ళద్దాలను పెట్టుకొనీ
ఎల్లరినీ పరికిస్తారు.

నెమ్మదిగా మా మేస్టారు
గమ్మతులెన్నో చేస్తారు
కమ్మని కథలను చెబుతుంటే
కిమ్మనకుండా వింటాము.

ఆటలలో మరి పాటలలో
పోటీలెన్నో పెడతారు
ఓడినవారిని ఎప్పుడుకూడా
హేళన చెయ్యొద్దంటారు.

మేస్టారే అగుపించనినాడు
ఏదో వెలితిగ ఉంటుంది.
మేస్టారేఁ కనిపించిన క్షణము
లేచి వస్తుంది ప్రాణము.

*　　*　　*　　*　　*

# మల్లెపందిరి

మల్లెపందిరి ఒకటి
ఉంది మా ఇంట
కల్లకాదండి అది
మా నోము పంట.

కల్లలే ఎరుగని
పిల్లలందరును
మల్లెపందిరి కింద
మెల్లగా చేరీ –
ఆటలేఁ ఆడుతూ
పాటలే పాడుతూ
ముద్దుముద్దుగ రోజు
పొద్దు పుచ్చెదరు.

పువ్వులందిస్తాయి
మంచి వాసనలు
ముద్దులందిస్తారు
చిన్నారి కూనలు.

ముసిముసిగా నవ్వు
పసివారినీ జూచి
విరిసిన ప్రతి పువ్వు
పరవశత్వము నొందు.

* * * * *

# నవంబరు 14

జవహర్ చాచా పుట్టాడు నేడు
తండోపతండాలు బాలలను చూడు.

చాచా పుట్టింది శ్రీమంతులింట
చాచా చదివింది సీమలోనంట.

చాచా చేశాడు ఘనమైన పనులు
చాచా సేవలే బంగారు గనులు.

యుద్ధాన్ని వద్దనీ నిరసించె చాచా
శాంతిదూతగ కీర్తి నార్జించె చాచా.

ఆశించె చాచా విశ్వశ్రేయమును
నెరవేర్చె చాచా జాతిధ్యేయమును.

కల్లకపటములేని పిల్లలందరినీ
మురిపించె చాచా; మైమరిచె చాచా.

చాచా ఫోటోకు మొక్కి అనుదినము
చాచా బాటలో నడవాలి మనము.

*  *  *  *  *

# చిట్టీపాపా!

చిట్టీపాపా! పొట్టీపాపా!!
తోట కెడదామా?
తోటకెళ్ళీ ఆటలన్నీ
ఆడేసొద్దామా?

కొలనూ ఉంది; కోవెల ఉంది
చూసీ వద్దామా?
స్నానం చేసీ, పూజలు చేసీ
ఆనందిద్దామా?

చిలకా ఉందీ, కోయిల ఉందీ
పలకారిద్దామా?
పలుకులే వినీ, పాటలే వినీ
సంతోషిద్దామా?

కోతీలాగా కొమ్మాలన్నీ
ఎగిరేసొద్దామా?
ఉడతాలాగా పైకీ కిందికి
పరుగులు తీద్దామా.

ముద్దూ ముద్దుగ తోటలోనే
పొద్దు పుచ్చుదామా?
అలసీ సొలసీ ఆలస్యంగా
ఇళ్ళకు వద్దామా?

* * * * *

# ఆరోగ్యమే భాగ్యము

ఆటలెన్నో ఆడుము
పాటలెన్నో పాడుము
ఆటలకే రానివారి
స్నేహమ్మును వీడుము.

ఆటలతో నీ కాయము
గట్టిపడుట ఖాయము
పాటలతో నీ డెందము
పొందును ఆనందము.

ఆరోగ్యమే భాగ్యమనే
మాటనెపుడు మరవకుము
ఎండవేడిమికి, చలికీ
దేనికి నువ్ వెరవకుము.

అల్లరిపని చేయకుము
అతిగా మాట్లాడకుము
పెద్దలముందర ఎప్పుడు
హద్దుమీరి నడవకుము.

ఇంటికి వచ్చిన అతిథుల
మర్యాదగ చూడుము
బుద్ధిగ మసలుతు ఎప్పుడు
బద్ధకమును వీడుము.

* * * * *

# చెరపకురా చెడెదవు

పంతులు:

చిట్టీ పొట్టీ పాపల్లారా!
మిలమిల మెరిసే చేపల్లారా!!
కట్టుకథ కాదు సుమా
ఓ పిట్ట కథ చెప్పనా?

పిల్లలు:
ఓc. చెప్పండి. వింటాం.

పంతులు:

ఊరికి ఆవల ఉందొక కోన
కోనకు నడుమా ఉంది కోవెల
కోవెల పక్కన ఉందొక చెట్టు
చెట్టుకు ఉందొక చక్కని గూడు.

పిల్లలు:
బలే బలే! బాగుంది కథ.

పంతులు:

గడ్డీ, ఈకలు తీసుకువచ్చీ
పిట్టల జంటా కట్టెను గూడు
గూటిలోన అవి ఎంతోకాలము
చేసెను హాయిగ కాపురము.

పిల్లలు:
ఆc. తర్వాత?

పంతులు:

గుడ్లను కూడా భక్షించినది
వేగమె పుట్టకు చేరినది
గూటిలోన తన పెంటినిగానక
పిచ్చుక భోరున ఏడ్చినది.

పిల్లలు:
పాడు పాము! ఎంత పని చేసింది?

పంతులు:

ఏడుస్తూ ఆ పిచ్చుక పూర్తిగ
తిండీ, నీరూ మానినది
మూడునాళ్ళకే కృంగీ, కృశించి
ప్రాణాలను విడిచేసినది.

పిల్లలు:
అయ్యో ఎంత ఘోరం!

పంతులు:

ఇట్టులుండగా ఒక్కరోజున
విచిత్రమొక్కటి జరిగినది.
ముంగిస ఉన్న పొదకు చెంతనే
పాము మెల్లగా తిరుగసాగినది.

పిల్లలు:
అయితే ఏమయింది?

పంతులు:

ముంగిస పామును చూచి వెంటనే
లంఘించెను అతి వేగమున
పన్నగానికీ, ముంగిసకి మధ్యన
పోరు జోరుగా సాగినది.

పిల్లలు:
బలే బలే! తర్వాత?

పంతులు:

హోరా హోరిగ పోరు జరిగినది
ముంగిస విజృంభించినది.
అక్కసు తీరగ ముంగిస పామును
ముక్కలు ముక్కలు చేసినది.

పిల్లలు:
బలే శాస్తి జరిగింది.

పంతులు:

చిట్టీ పొట్టీ పాపల్లారా!
విన్నారు కదా కథ సాంతం
పరులకు ద్రోహం చేసినవారికి
పాముకు పట్టిన గతి పట్టున్.

పిల్లలు:
నిజమే. మేమెప్పుడూ అలా చేయము.

*   *   *   *   *

# చుక్కల్లారా!

చక్కని చిక్కని చుక్కల్లారా!
లెక్కకు మించిన రిక్కల్లారా!!
ఉంటారెప్పుడు మింట
వస్తారా మా వెంట?

మినుకు మినుకుమని వెలిగెదరెప్పుడు
మావలె చేయరు ఒకటే చప్పుడు
క్రమమే తప్పరు మీరు
ప్రతి రేయీ దర్శనమిస్తారు.

బారులు తీరి నిలుచుంటారు
కారు చీకటిని పోగొడతారు
కదలరు మెదలరు మీరు
ఆ నింగిని ఎప్పుడు వదలరు.

అందాలొలికే జాబిలి మామ
ఉన్నాడని మీకెంతో ధీమా
అనుకుంటే మేమంతా వచ్చి
పొందగలము ఆ జాబిలి ప్రేమ.

తీరిక ఎరుగని తారకలారా!
కోరికలేవో చెప్పండి
కూరిమితో మేమంతా వచ్చి
కోరికలన్నీ తీరుస్తాము.

చక్కని చిక్కని చుక్కల్లారా!
మక్కువ చూపే అక్కల్లారా!!
ఒకపర్రి వస్తారా మా ఇంటికి
మమ్మే రమ్మంటారా మింటికి?

*  *  *  *  *

# మా ఊరు

చూడ చక్కనిది మా ఊరు
ఊరు పక్కనే సెలయేరు
ఎండిపోదు ఆ ఏరు
ఇచ్చును తియ్యని నీరు.

ఏటినుంచి తీశారు పెద్దలు
పిల్లకాలువలు ఎన్నెన్నో
పంటభూములకు చేరును నీరు
పండును దండిగ పంటలు.

పంటలు పండగ నిండిపోవును
ఇళ్ళలోని మా గాదెలు
పచ్చికమేసీ మచ్చిక తోడ
పాలు ఇస్తాయి గేదెలు.

మువ్వలు కట్టిన తువ్వాయిలతో
పరుగులు తీస్తాం ప్రతిరోజూ
పాలూ పెరుగూ బాగాతాగీ
తీర్చుకుంటాము మా మోజు.

ఏటి ఒడ్డునే ఉంది మా బడి
ఎదురుగ ఉంది శివుని గుడి
బడిలో గంటలు, గుడిలో గంటలు
నిత్యం మోగుతు ఉంటాయి.

గణగణమని మా గంట మోగగా
ఒడికి చేరుతామందరము
వందేమాతర మాలాపించి
తరగతిలోనికి వెళతాము.

పండుగ రోజున పూజారయ్య
పిలుస్తాడు మా అందరినీ
ప్రసాదమూ, పులిహోరా, లడ్డూ
ఇస్తాడూ ప్రతి ఒక్కరికీ.

తగవులు, కొట్లాటలు, అల్లరులు
ఎలాంటివో మరి తెలియవు మాకు
స్వర్గము సుమండి మా ఊరు
గడించినది ఘనమైన పేరు.

* * * * *

# అమ్మా! నీకెందుకమ్మ?

అమ్మా నీ కెందుకమ్మ
తమ్ముడంటె అంత ప్రేమ?
పాలిస్తూ లాలిస్తూ
వదలవు మరి కదలనీవు.

పొద్దున్నే ంకేమో
చద్దన్నం పెడతావు
వేళ తప్పకుండ బడికి
వెళ్ళు వెళ్ళమంటావు.

పిచ్చి పిచ్చి గీతలెన్నొ
బుజ్జిగాడు గీస్తుంటే
మెచ్చుకుంటు వాణ్ణెప్పుడు
ముద్దు పెట్టుకుంటావు.

ఎన్నెన్నో పాఠాలను
నే చదవగ నాన్నగారు
మెచ్చుకుంటారు కదా
నువ్వెప్పుడు మెచ్చుకోవు.

అ ఆలే రానివాడు
తమ్ముడంటె నీకు గొప్ప
అన్నీ వచ్చినవాడిని
నాన్నారికి నేను గొప్ప.

* * * * *

# శాస్తి

రామాపురమందు కలడు
రాముడనే కుఱ్ఱవాడు
ఉన్నది ఆ అబ్బాయికి
చెప్పలేని బడాయి.

ఒక్కరోజు సెలవు రాగ
పిల్లలంత గుమికూడిరి
చక్కగ ఆలోచించిరి
చెరువుగట్టునకు చేరిరి.

ఎగిరినారు దుమికినారు
ఆటలెన్నో ఆడినారు
చిట్టచివరకూ అందరు
పిట్టగూళ్ళు చేసినారు.

ఇంతలోనె రాముడొచ్చి
పిల్లలతో ఇలా అనెను:
"పిచ్చివాళ్ళు మీరంతా
పిట్టగూళ్ళు చేసినారు.

చూస్తూ ఉండండి మీరు
తవ్వుతాను ఒక చెలమను
చెలమలోని ఆ జలము
నిజముగ అమృత సమము."

అని రాముడు వెళ్ళి ఒక్క
కర్రను కొని తెచ్చినాడు
విసుగెరుగక ఇసుకలోన
గోయి తవ్వ సాగినాడు.

కొంతసేపు శ్రమకు ఓర్చి
ఒక్క అడుగు తవ్వినాడు
మరి కాస్తా కష్టపడీ
మరో అడుగు తవ్వినాడు.

రెండు అడుగులే తవ్వి
సంబరపడి అన్నాడు:
"చూడండర్రా మీరూ
ఊరుతుంది ఇక నీరు."

పిల్లలంత తొంగి తొంగి
గోతిలోకి చూసినారు
ఎంతసేపు చూసినను
ఊరలేదు నీరు అసలు.

"ఆకతాయి రాముడొచ్చి
ఆటను చెడగొట్టినాడు"
అని పిల్లలు రామునిపై
కురికినారు ఆగ్రహించి.

ఎప్పుడు మరవని రీతిగ
దేహశుద్ధి చేసినారు
బడాయి రామునికీ
బలే బుద్ధి నేర్పినారు.

* * * * *

# మా బుజ్జిగాడు

ఎంతో మంచివాడు
మా బుజ్జిగాడు
బజ్జీలు తింటాడు
బడికి వెడతాడు.

వేకువనె లేస్తాడు
పుక్కిలిస్తాడు
చక్కగా పద్యాలు
వల్లె వేస్తాడు.

జెండాల పండుగకు
ఎన్నెన్నొ బహూమతులు
మోసుకొని వచ్చాడు
తెగ మురిసిపోయాడు.

బళ్ళోన తననెంతొ
మెచ్చుకుంటారనీ
పేర్లన్నీ వరుసగా
ఏకరువు పెడతాడు.

నాన్నారు ఎపుడైన
మెచ్చుకుంటే చాలు
మెరిసిపోతాయండి
మావాడి కళ్ళు.

తెలివిగల వాడండి
మా బుజ్జిగాడు
తప్పకుండా గొప్ప
వీరుడవుతాడు.

*     *     *     *     *

# సీతయ్య

చీమిడి ముక్కూ సీతయ్యా
మామిడి ముక్కలు తింటూనే
తరగతిలోనికి వచ్చాడు
సీటుపైన కూర్చున్నాడు.

తోటి పిల్లలూ అది చూసీ
పకపకమని నవ్వుతుండగా
పంతులు రానే వచ్చాడు
అంతా గమనించన్నాడు:

"చూశావా మరి సీతయ్యా!
పిల్లలందరూ నిను చూసీ
ఎలాగ నవ్వుతు ఉన్నారో
గేలి ఎలా చేస్తున్నారో?

బళ్ళోకందరు వచ్చాక
మానుకోవాలి చిరుతిండి
క్రమశిక్షణ పాటించాలి
చదువు చక్కగా నేర్వాలీ.

రోజూ పొద్దునె స్నానంచేసీ
ఉతికిన బట్టలు తొడుక్కొనీ
జుట్టు చక్కగా దువ్వుకొనీ
బడికి క్రమంగా రావాలీ."

పంతులు మాటలు విన్నాక
మారిపోయాడు సీతయ్య
శుచీ శుభ్రతలు పాటిస్తూ
అందరి మన్ననలొందాడు.

*     *     *     *     *

# పిచ్చుకల పెళ్ళి

వానా కురిసిందీ
వాగులు సాగాయీ
పిల్లలు చేసిన తెల్లని పడవలు
ముందుకు ఉరికాయీ.

పడవల వెంటా పిల్లలందరూ
పరుగులు తీశారు
చెరువు గట్టునకు చేరుకొనీ
సంబరపడ్డారు.

ఇసుక తిన్నెపై కూచొని చక్కగ
పిచ్చుక గూళ్ళను చేశారు
గుడ్డముక్కలతో పిచ్చుక బొమ్మలు
ఇట్టే తయారుచేశారు.

గూటి కొక్కటీ పిచ్చుక జంటను
చక్కగ కూర్చోబెట్టారు
'తూ, తూ' అని సన్నాయి పాడుతూ
వరుసగ పెళ్ళీ చేశారు.

కొందరు వెళ్ళీ పప్పూ, బెల్లం
కొబ్బరి ముక్కలు తెచ్చారు
పెళ్ళిభోజనం అదే అనుకొని
చక్కగ అందరు మెక్కారు.

పెళ్ళి సంబరం పూర్తి చేసుకొని
ఇళ్ళకు పరుగులు తీశారు
తలచుకుంటు ఆ బొమ్మల పెళ్ళిని
కమ్మగ నిదురా పోయారు.

* * * * *

# ఒకటోయ్ ఒకటి

ఒకటోయ్ ఒకటి
బడిలో అందరమొకటి.

రెండోయ్ రెండు
మనది పేరుగల దండు.

మూాడోయ్ మూాడు
చెడును పూర్తిగా వీడు.

నాలుగోయ్ నాలుగు
చదువుము తియ్యని తెలుగు.

ఐదోయ్ ఐదు
నేరము చేస్తే ఖైదు.

ఆరోయ్ ఆరు
మనకు వద్దులే పోరు.

ఏడోయ్ ఏడు
కమ్మని పాటే పాడు.

ఎనిమిదోయ్ ఎనిమిది
మంచిమాటలే వినుమిది.

తొమ్మిదోయ్ తొమ్మిది
ఇంటా బయటా నెమ్మది.

పదోయ్ పదీ
పరవశించులే నీమది.

*        *        *        *        *

# చిలకమ్మా!

చిలకమ్మా ఓ చిలకమ్మా!
మము పలకరిస్తావా?
మాటల జల్లును మాపై
కొంచెం చిలకరిస్తావా?

అగుపించవు మాకసలే నువ్వు
చూడాలని నీ తోటకువస్తే
చిగురులు మెక్కి దూరతీరాల
ఎగురుతు ఉంటావేమొ?

తియ్యతియ్యనీ పండ్లన్నీ
తినబెడతాము వస్తావా?
ముద్దు ముద్దుగా పలికి అందరికి
మోదమ్మే కలిగిస్తావా?

చెప్పినట్లుగా వింటే నీతో
చేస్తాం మేము నేస్తం
కోరుకునేది ఒక్కటేమిటి
ఇచ్చేస్తాం సమస్తం.

పొద్దూ మాపూ తిండికోసమై
ప్రయాస ఎందుకు నీకు?
హద్దుమీరక మాతో ఉంటే
ఉండదు చింతాచీకూ.

*    *    *    *    *

# టైగర్

నమ్మకమైనది మా కుక్క
కాస్తుంది కాపలా ఎంచక్కా!

ఎంత చిన్న అలికిడి విన్నా
అరుస్తుంది అతి బిగ్గరగా
కొత్త మొహాలను చూస్తే చాలు
దూకును మీదికి క్షణాలమీద.

మాలో ఎవ్వరు కనబడినా
తోక ఊపుతూ ఉంటుంది
అస్తమానమూ మావెంటే
పచార్లు చేస్తూ ఉంటుంది.

పొరపాటున మాలో ఎవరైనా
కస్సుబుస్సుమని అంటేను
మూలకు వెళ్ళీ పడుకుంటుంది
ఉలకదు పలకదు అలకమానదు.

మెల్లమెల్లగా వీపు నిమురుతూ
బుజ్జగించాలి ఎంతో సేపూ
అప్పుడు పెడితే ఆరగిస్తుంది
బిస్కెట్లూ మరి రొట్టెలు, పండ్లూ.

టైగర్ కెంతో ఇష్టం పోరు
సాహసానికది మారుపేరు
మా టైగర్ కనిపిస్తే చాలు
జారుకుంటాయి శునకాలు.

*     *     *     *     *

# గణ గణ

బడి గంట గణ గణ
పిదప జనగణమన
ప్రార్థన ముగిశాకనే
తగుతుంది రణగొణ.

నడుస్తాము చకచక
ఉరుకుతాము టకటక
పంతులయ్య జోకువిని
నవ్వుతాము పకపక.

తారలన్ని మిలమిల
మెరపులన్ని తళతళ
బాటలలో తోటలలో
ఒకటే మా కిలకిల.

సెలయేరుల గలగల
శుకపికాల కలకల
వింటూ కొండలు కోనలు
తిరుగుతాము అలాఅలా.

*　　*　　*　　*　　*

# దీపాలపండుగ

దీపాల పండుగ వచ్చింది
దీప్తి అంతటా హెచ్చింది.

లోకాలను చీకాకుపరిచిన
నరకాసురుడు అస్తమించెను
వెలుగులు అంతట విస్తరించగా
నిఖిల జగమ్మే ఆనందించెను.

నాటినుండి ఈనాటివరకును
చేస్తున్నారీ పండుగ
పండుగరోజున ప్రతి ఇల్లూ
అగుపించును ఎంతోనిండుగ.

తలంటి స్నానం చేస్తాము
కొత్తబట్టలను వేస్తాము
అమ్మలు చేసిన కమ్మని వంటలు
కిమ్మనకుండా తింటాము.

టపాకాయలూ, బాణాసంచా
చిచ్చుబుడ్లు మరి కాకరపువ్వులు
కాల్చుతాము మేమందరమూ
పడతామెంతో సంబరమూ.

పండుగరోజున పేదాసాదా
తింటారంతా మెండుగా
ఏడాదికి ఒకమారే కద
అయితేనేమి దండుగ?

*    *    *    *    *